# ROYAL ALBERT HALL

MEETING of HEAVY and WELTER and LIGHT-WEIGHT
CHAMPIONS of GREAT BRITAIN and EUROPE.
UNDER THE ENTIRE MANAGEMENT OF HARRY JACOBS. (MUSEUM 4701.)

THURSDAY, JANUARY 22 at 8 p.m. sharp.

GREAT INTERNATIONAL 20 (3-min.) RDS. CONTEST.

## TED (KID) LEWIS
(Ex-Welter-weight Champion of the World)

V

## FRANCIS CHARLE
(France: Middle-weight Champion of Europ

SPECIAL IMPORTANT 20 (3-min.) ROUNDS CO

## HARRY MASON v SONNY BIRD
(Leeds; Light-weight Champion of Europe) (Chelsea; coming 10st Champion of England).

GREAT SPECIAL 20 (3 min.) ROUNDS ELIMINATING HEAVY-WEIGHT
CHAMPIONSHIP CONTEST, FOR £100 A SIDE AND PURSE 450.

**PHIL SCOTT** (Herne Bay) v **JACK STANLEY** (Deptford)

"Sporting Life and Sportsman" hold the stakes and appoint Referee.

SPECIAL 10 (3-min.) ROUNDS CONTEST.

**CHARLEY RING** (Australia) v **MARINE TRINDER** (Portsmouth).

Two SPECIAL 10 ROUND CONTESTS Time Permitting.

Gallery Promenade 5/9. Balcony 10/6. ...

13/3/24

శ్రీ వరాహ వేంకటేశాయనమః

శ్రీ పద్మాపతయేనమః

# శ్రీవరాహ వేంకటేశ్వర మాహాత్మ్యము.

శ్రీ నైమిశారణ్యంబున ప్రస్తావన, జగదుత్పత్తిమహిమ, శ్రీ వరాహ యవతారమహిమ, గరుత్మంతుఁడు భూలోకమునకు క్రీడాద్రినిఁ దెచ్చుట, బ్రహ్మేంద్రాదులు మహావిష్ణువును వెదకుట, శ్రీ వేంకట విభుండు వైకుంఠమున కరుగుట, భృగు త్రిమూర్తులఁ బరీక్షించుట, శ్రీ పద్మాదేవి హరిపై యలుగుట, అల భగవంతుఁడు వెంకటాద్రిఁ జేరుట, కరియావు భగవంతునికి క్షీరంబు లొసంగుట, మాసోత్సవములు, తీర్థస్నాన [illegible]లంబులు, తలిమ వుత్సవములు, క్షేత్రనిబంధనములును గలవు.

శ్రీ వేంకటేశ్వర భక్తసమాజమువారి

ప్రకటితము.

1917

MADRAS.

PRINTED BY GRAVES COOKSON & CO., AT THE SCOTTISH PRESS.



వెల. 1 0

శ్రీ

శ్రీ వేంకటేశాయనమః,

# శ్రీ వేంకటేశ్వర స్తోత్రము

శ్లోకములు.

సరోజపత్రలోచనం సుసాధులోకపావనం ।
చరాచరాత్మక ప్రపంచ సాక్షిభూతమవ్యయం ।
పురారిపద్మజామరేంద్ర పూజితాంఘ్రిపంకజం ।
స్మరామి వేంకటేశ్వరంచ సాగరాత్మజేశ్వరమ్ ॥

పురాణపూరుషం సమస్త పుణ్యకర్మరక్షణం ।
మురాసురాదిదానవేంద్ర మూర్ఖదర్పభంజనమ్ ।
ధరాధరోద్ధరంప్రశాంత తాపసాత్మవీక్షణం ।
స్మరామి వేంకటేశ్వరంచ సాగరాత్మజేశ్వరమ్ ॥

శరాసనాదిశస్త్రబృంద సాధనంశుభాకరం ।
ఖరాఖ్యరాక్షసేంద్రగర్వ కాననోగ్రపావకమ్ ।
నరాధినాథవందితం నగాత్మజాత్మసన్నుతమ్ ।
స్మరామి వేంకటేశ్వరంచ సాగరాత్మజేశ్వరమ్ ॥

సురారిశౌర్యనిగ్రహం సుపర్వరాట్పరిగ్రహం ।
పరాత్పరం మునీంద్రచంద్ర భావగమ్యవిగ్రహమ్ ।
ధరామఘౌఘశోషణం సుధాతరంగభూషణం ।
స్మరామి వేంకటేశ్వరంచ సాగరాత్మజేశ్వరం ॥

శ్రీ

శ్రీ వరాహ వేంకటేశాయనమః.

శ్రీ లక్ష్మీపతయేనమః.

# శ్రీ వరాహ వేంకటేశ్వర మాహాత్మ్యము.

శ్లో॥ శ్రీ కల్యాణగుణోల్లాసం చిద్విలాసం మహోదారసం ।
శేషాద్రిమస్తకావాసం శ్రీనివాసం భజామహే ॥

శ్లో॥ వారాహవేషం భూలోలం లక్ష్మీమోహనవిగ్రహం ।
వేదాంతగోచరం దేవం వేంకటేశం భజామహే ॥

## ప్రస్తావన.

సిద్ధజన సేవితంబైన నైమిశారణ్యమందు * సత్రయాగంబుఁజేయుచు గౌతమ జాబాలి కశ్యపాంగీరస శ్రీవత్స కౌత్స మైత్రేయ పులహ కణ్వ గార్గేయ మృకండు భరద్వాజ కౌశిక దేవల క్రతు పులస్త్యాది సన్మునులందఱు సకల పురాణ కథాశ్రవణ కుతూహలాయత చిత్తులై యొకనాఁ డుషఃకాలంబున లేచి

* సత్రయాగము సహస్రవర్షంబుల యాగము, 13 మొదలు 100 దినములవఱకు జరుగు నొక యజ్ఞమునకు నీపేరు కలదు.

స్నాన జప హోమాద్యాయ నానుష్ఠానంబులఁదీర్చుకొని సుఖా సీనులైయుండి పౌరాణికోత్తముండైన సూతమహాముని నవ లోకించి ధాత్రియందుగల 108 * తిరుపతులలోని †. యెనిమిది స్వయంవ్యక్తంబులందు కడువిశేషించినదై ఐహికాముష్మిక ఫల సకలసిద్ధి ప్రదంబైన ‡ శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును జెప్పుమని ప్రార్థింప సూతమహాముని యిట్లానతిచ్చెను.

# జగదుత్పత్తి మహిమ.

శ్రీయఃపతియై, అక్షయ బ్రహ్మానంద నిలయుండై, సకల జగదాధారుండై, క్షీరాబ్ధిశయనుండై యున్న పరాత్పరుఁడు సంకల్పమాత్రముచేత తన నాభికమలంబునందుండి చతురాస్యుని జన్మింపఁజేయ నలువ స్థావర జంగమాత్మకమగు నశేష భూత ప్రపంచంబుల సృజించెను. ఇట్లుండ బ్రహ్మయొక్క

---

* తిరుపతి యనునది ద్రావిడనామము. తిరుపతి యనగా లక్ష్మీపతిలేక లక్ష్మీశుండైన శ్రీ వేంకటేశ్వరుని క్షేత్రమని యర్థము.

† శ్రీరంగ, శ్రీముష్ణ, తోతాద్రి సాలగ్రామ, నైమిశ, బదరికాశ్రమ, కాంచీపుర, వేంకటాచలంబుల కష్టస్వయం వ్యక్తంబులని పేరు. స్వయం వ్యక్తంబులనగా తమంతట తామే యుత్పన్నమైన దేవస్థలంబులని యర్థము.

‡ "సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహ ఉచ్యతే" అన్నట్లు సర్వ పాపములను హరించును గాన వేంకటాచలమని ప్రసిద్ధిగాంచెను.

పగలు కాలమైన * **4,32,000,0000** సంవత్సరములు (నన్నూటముప్పై రెండుకోట్ల సంవత్సరములు) విశ్వంబును జగద్రక్షకుండైన శ్రీమన్నారాయణుండు పాలించుచుండెను. తన పగలు కాలము ముగిసినంత పద్మజుఁడు నిద్రపోగ † ప్రళయము సంప్రాప్తమయ్యెను. కాఁబట్టి భానుఁడతి యుగ్రముగాఁగ్రక రాళిని ప్రభలఁజేయ స్థావర, జంగమ చయములడంగెను. మేఘంబులును దీర్ఘకాలంబుగా నమితమైన కుంభవర్షంబులఁ గురియించ జలము వెల్లువలుబార నానీటిబరువున కోపక భూమి మహోదధిలోనికి గ్రుంకెను. అంత ‡ హిరణ్యాక్షుఁడు వసుధను రసాతలంబునకుఁ గొనిపోయి బహుకాలమందు క్రీడించుచుండెను.

---

* జగతి ఆయువే బ్రహ్మ ఆయువు, బ్రహ్మ ఆయువు 100 బ్రహ్మ సంవత్సరములు. ఒక బ్రహ్మ సంవత్సరమునకు 360 బ్రహ్మ దినంబులు, బ్రహ్మయొక్క ఒక్క పగలే ఒక కల్పము. కల్పమునకు 12,000,0000 కోటి యిరువది లక్షల దేవసంవత్సరములు, ఒక దేవసంవత్సరమునకు 360 మనుష్య సంవత్సరములుగాన 360 × 12,000,000 = బ్రహ్మపగలు కాలమునకు 4,32,0000,000 మనుష్య సంవత్సరములు.

† బ్రహ్మ దినప్రళయము, మహాప్రళయముకాదు.

‡ బంగారు కన్నులుగలవాఁడు, హిరణ్యకసిపుని సోదరుఁడు.

# శ్రీవరాహ యవతార మహిమ.

ఇట్లుండ బ్రహ్మ రాత్రికాలమైన 4,320,000,000 నన్నూటముప్పై రెండుకోట్ల సంవత్సరములు జరిగిన తర్వాత సర్వజగన్నియామకుండైన శ్రీ మహావిష్ణువు మఱల సృష్టి సేయింపందలంచి * శ్రీ శ్వేతవరాహ రూపమును పరిగ్రహించి మహాజలధిలోనికిం జొరంబడి భూమినిం బైకెత్తంబూనెను. అత్తఱి హిరణ్యాక్షుండు కోపోద్రేకుండై యడ్డంబువచ్చి యుద్ధంబు సేయ సర్వశక్తి యుతుండైన శ్రీ వరాహమూర్తి ఆ రక్కసుని నిజదంష్ట్రాగ్రంబున ప్రయ్యలుసేసి చంపి భూమినింబైకితెచ్చి పూర్వప్రకారము కుదురుగానిల్పి బ్రహ్మనుమేల్కొల్పి పునః సృష్టింజేయుమని యాజ్ఞాపించెను. అప్పుడు దేవతలందఱు శ్రీ వరాహమూర్తికి దండప్రణామంబు లాచరించి, భేరీ మృదంగాది వాద్యముల మొరయించి, పుష్పవానల గురియించి పెక్కువిధంబుల వినుతించిరి. పిమ్మట శ్రీవరాహమూర్తి వైనతేయుని వైకుంఠములోనున్న క్రీడాచలంబును దెమ్మని బంపి తాను గౌతమీనదికి దక్షిణంబున నిలువది యోజనములు దూరముగానున్న తూర్పు

---

* జగత్ సృష్టికి వెనుక 8,640,000,000 అనగా ఎనమన్నూట యఱువదినాల్గు కోట్ల సంవత్సరములైన తర్వాత శ్రీ వరాహస్వామి యవతరించిరి.

సముద్రమునకు నైదు యోజనంబులు పశ్చిమమున * సువర్ణ ముఖరినదికి యుత్తరముగనున్న శ్రీ వేంకటాచలంబున వేంచేసి యుండెను.

## గరుత్మంతుఁడు భూలోకమునకు క్రీడాద్రినిఁ దెచ్చుట.

ఇట్లుండ ఖగేంద్రుఁడు వైకుంఠమునకుఁజని మహాలక్ష్మితో హరి యాజ్ఞను నివేధించ, జగజ్జనని యొక కళతో క్రీడాద్రి నధిరోహించెను. అంత గరుత్మంతుఁడు వేగిర నా పర్వత రత్నమును పెకలించి భూలోకమునకుఁదెచ్చి శ్రీవరాహాస్వామి చూపిన దివ్యస్థలంబున నిల్పెను. అప్పుడు భగవంతుఁడా పర్వతంబెక్కి యందున్న పుష్కరిణికి పశ్చిమ తటంబున వేంచేసియుండ బ్రహ్మ రుద్రేంద్రాదులువచ్చి యా వరాహాస్వామికి నమ్రులై ప్రణామంబులు సేసి, బహుప్రకారంబుల ప్రస్తుతించి జయజయ శబ్దంబులుసేయుచు ముకుళిత కరకమలులై నిలచియుండిరి. అంతట లోకరక్షకుఁడు నిరతిశయ కృపాభరితుండై సౌమ్యరూపముతో భానుకోటి ప్రభాభాసమైన

---

* బంగారు ముఖముగలది. స్వర్ణగిరులైన శేషపర్వతములఁబ్రక్కఁ బ్రవహించుటచే దీనికి పేరు కలిగినది.

మాయానిగూడ విమానమందు వేంచేసీ దేవకోటులకు దరిసెనమిచ్చి పిమ్మట నా విమానముతో నంతర్ధానుఁడయ్యెను.

## బ్రహ్మేంద్రాదులు మహావిష్ణువును వెదకుట.

సనకాదియోగుల శాపవశముచేత జయవిజయులు, కనకలోచన హేమకసిపులను పేర దైత్యులై పుట్టి సాధుబాధల నొనర్ప శ్రీమహావిష్ణువు శ్రీ శ్వేతవరాహమూర్తియై హిరణ్యాక్షునిన్ని, నృసింహమూర్తియై హిరణ్యకసిపునిన్ని ద్రుంచ కొంత కాలమునకు మఱల వారు రావణ కుంభకర్ణులై పుట్టి సాధుజనుల బాధించ దేవర్షులెల్లరును దుగ్ధవారిధికేగి రావణుని బాధలఁదప్పించుమని ప్రార్థింపగా విష్ణుదూత యొకఁడు వారలంజూచి భగవంతుఁడచ్చట లేఁడనియు, భూమండలమునందొక పర్వతాగ్రమునందున్నాఁడనియుఁ బల్కెను. అంత వారు మరలివచ్చుచు నారదభగవానుల సంధించి వారితో నిజవృత్తాంతములఁ జెప్ప, నారదులు వారల నందఱినిఁ దోడ్కొని బ్రహ్మాకడకువచ్చి కలరూపెల్ల నెఱింగించెను. బ్రహ్మా వారలను దేవేంద్రాదులను దోడ్కొని వేంకటాద్రికి వచ్చి శ్రీస్వామి పుష్కరిణిలో గ్రుంకుచు ఫల పుష్పములఁగొని కమలనాభుని పూజించుచు భగవంతుని దరిసెనమునకు * వేచియుండెను.

* ఆ కాలమునందు దశరథమహారాజు పుత్రార్థియై శ్రీస్వామి పుష్కరిణీ తటంబున తపము సేయుచుండెను.

ఇట్లుండ కొంతకాలమునకు భగవంతుఁడు వారలకు * ప్రసన్నుండై వారి మొఱల నాలకించి తన చక్రాయుధమును బంపి రాక్షసుల సంహరించి మనుష్యకోటుల నుద్ధరించెను. తర్వాత బ్రహ్మ సంతసిల్లి సకల దేవగణంబులతోఁగూడి వేంకటాద్రిలో భగవంతునికి తొమ్మిది దివసంబులు † మహోత్సవములు జరిపించెను.

## శ్రీ వేంకటవిభుండు వైకుంఠమున కరుగుట.

ఇట్లుండగాఁ గొంతకాలమునకు భగవంతుఁడు వైకుంఠపురమును దలఁచి యచ్చటి నిత్యముక్తులనుజూడఁగోరి శేషాద్రినేలుమని శ్రీ వరాహమూర్తికి యొప్పగించి శ్రీ భూనీళాసమేతుండై మాయానిగూఢ విమానమెక్కి వైకుంఠమునకేగి యందుండు నిత్యముక్తులఁజూచి యాదరించి యప్రాకృతమణిమయానంతః పురంబున శేషతల్పంబునందు వసియించుచుం

---

* బ్రహ్మేంద్రాదులకు శ్రీమన్నారాయణుండు ప్రసన్నుండైనప్పుడు శివుఁడేగి నుతించి తానున్ను శేషాద్రియందుండెదనని ప్రార్థింప చక్రపాణి సంతసిల్లి ఈశ్వరుని కొండక్రింద నుండుమని నియమించె గావున నా యుమాకాంతుఁడు కపిల తీర్థఘట్టంబున వెంచేసి శ్రీ కపిలేశ్వరమూర్తియై ప్రకాశించుచున్నాఁడు.

† దీనికే బ్రహ్మోత్సవములని పేరు.

డెను. తదనంతరము శ్రీ వరాహమూర్తి విశ్వకర్మ నిర్మితంబైన పురంబు నంతర్ధానం బొనరించి శేషాద్రియందు విహరించుచు * వృషభాసురునితో యుద్ధంబు సేయ వెడలెను. ఇట్లు కొన్ని యుద్ధంబులు జరిగినవెనుక నారదభగవాను లొక్కనాడు వేంకటాద్రికివచ్చి చూచి హరి యందులేడని యెఱింగి బ్రమ్మఱ సత్యలోకంబుజేరి బ్రహ్మతో హరిలేని వృత్తాంతమును దెల్పెను. అటుపై విరించి నారదులఁజూచి భూలోకమున శేషాచలము నందు భగవంతుఁడుండు కాలమున ప్రజలు సాత్వికులై మిక్కిలి పుణ్యాత్ములైయుండిరి. మఱియు నేగావించిన రథోత్సవము శ్రీ వరాహమూర్తికి మాత్రము జరిపించఁజాలదుగాన మఱల శ్రీనివాసుఁడు శేషాచలంబు వేగమ చేరుపాయము నీవు గావింపుమని చెప్పి వేంకటాద్రిపై వసుదేవ దశరథ తేజముల నొకతింత్రిణీ వృక్షముగను, దేవకీ కౌసల్య కళల నొక వల్మీకముగను గూర్చియుంచెను.

## భృగు త్రిమూర్తులఁ బరీక్షించుట.

ఇట్లుండ నారదభగవానులు బ్రమ్మర బయలుదేరి జాహ్నవీతీరమును జేరి యచ్చట క్రతువులఁజేయుచున్న కస్యపాది

---

* శ్రీ వరాహమూర్తి తుంబురుకోనవద్ద వృషభాసురుని సంహరించెను. ఈ కారణమువలన వేంకటాద్రికాకాలంబున వృషభాద్రియనియుఁబేరు కలదు.

మునీంద్రుల వీక్షించి మీరు సల్పెడి యజ్ఞ ఫలభోక్తయైన దేవుఁ డెవఁడని ప్రశ్నించ వారు సందియమునొంది యూరకుండిరి. అటుపై నారదులు ముమ్మూర్తులలో మోక్షప్రదుఁడైన దేవుఁ డెవఁడో విచారించి వానికి మీ యజ్ఞఫలంబుల సమర్పించి సంత సింపుఁడని జెప్పి పరమాత్మ ధ్యానుండై వెడలిపోయెను. తర్వాత కశ్యపాది మహర్షులు త్రిమూర్తులయందు ముక్తిప్రదుండైనమూ ర్తిని విచారించుకొని రమ్మని భృగు మునీంద్రుని నంపగ నమ్ముని సత్యకైలాస లోకంబులకేగి బ్రహ్మరుద్రులు * సత్వగుణ ప్రధా నులుగారని యెఱింగి వెనుక వైకుంఠమునకుఁబోయి శేషత ల్పంబునందు రమాసమేతుఁడై శయనించియున్న నారాయణుని వక్షంబునందు నిజపదంబెత్తి తన్నెను.

---

* భృగు తొలుదొల్త సత్యలోకము చేరి తపోజన పరివృతుండై కొలు వున్న బ్రహ్మసభలో ననుమతి లేక నాసనారూఢుండు కాఁగా బ్రహ్మ కోప ముచే మాటలాడకుండెఁ గాన నతఁడు రజోగుణ స్వరూపుఁడనియు, తర్వాత కైలాసంబునకుఁ జని పార్వతీ సమేతుఁడై క్రీడించుచున్న శివునియెదుటఁ బోయి నిలువ పార్వతి లజ్జించఁ జూచి శివుఁడు క్రోధోద్రేక రక్తాంక్షుండై మాటలాడకుండెఁగాన శివుఁడు తమోగుణ స్వరూపుఁడనియు, కాఁబట్టి రాజస తామస స్వరూపులు మోక్షప్రదులు గారనియు నిశ్చయించెను.

అప్పుడు మహావిష్ణువు దిగ్గునలేచి యమ్మునీశ్వరుని పాదమున కెంత నొప్పి కలిగెనోయని వానిని బహువిధముల నాదరింపగా భృగు శ్రీహరియొక్క సత్వగుణమునకుఁ గడు యచ్చెరువొందుచు త్రిమూర్తులందు శ్రీ మహావిష్ణువే † మోక్ష ప్రదుండని తీర్మానించి కశ్యపాదులయొద్దకేగి జరిగిన వృత్తాంత ములఁజెప్ప వారందఱు యజ్ఞఫలంబును శ్రీ మహావిష్ణువున కర్పి తంబుసేసి శ్రీమన్నారాయణధ్యాన పరాయణులైయుండిరి.

## శ్రీ పద్మాదేవి హరిపై యలుగుట.

అట్లు భృగు హరివక్షమునఁ దన్నిపోగా తద్వక్షంబు నందలరుచుండు లక్ష్మీదేవి దుష్ట*కార్యమును జేసిన భృగువర్యుని శిక్షింపక నాదరించినందుకు హరిపైఁగోపించుకొని యిక వైకుం

---

* భృగు భగవంతుని వక్షంబునఁదన్నినందువలన పాదమునందున్న నేత్రమును గోలుపోయెను.

† భక్తజను లెంత పాపములఁజేసినను క్షమించి రక్షించఁదగిన దేవుఁడే మోక్షప్రదుండౌను. పరిపూర్ణ సత్వగుణ స్వరూపుండు కానిచో మన్నింపఁదగు కారుణ్యము, శాంతముండదు. శ్రీ మహావిష్ణువు నిరతిశయ కృపానిధిగావున తన వక్షమందు తన్నిన భృగుమహామునియొక్క క్రూరకార్యమును నేరముగా భావించక దయతో రక్షించెను. కాఁబట్టి యసమాన కారుణ్యము గల శ్రీమన్నారాయణుఁడే మోక్షప్రదుండు.

శమునందుండ నొల్లననియు, నెచ్చటికైననేగి శ్రీనివాసుని పాదపద్మముల ధ్యానించుచు నుండెదననియుఁ జెప్పెను. అంత కోపముచే గదరుచున్న లక్ష్మీదేవినిజూచి కమలాక్షుఁడు ఓ యింతీ! భృగుమహాముని వన్నుటచే చాల శుభకరమయ్యెను. అందుకు కోపగింపకుమనెను. మఱల లక్ష్మీదేవి, పురుషోత్తమా! ఆత్మల కాత్మవై, విశ్వేశ్వరుఁడవైయున్న నిన్ను పూజించక మూర్ఖముగాఁదన్నిన యామునిని శిక్షించక సన్మానించితివిగదా యనెను. శ్రీహరి యందుకు ఓ కమలనయనా! భృగు నీకు మనుమఁడు, బిడ్డ బిడ్డైనవాఁడు, పిన్నవాఁడుగావున వాని యందు కూర్మిఁదలంపకఁ గొట్టనగునే, జీవకోటులును గుక్షిని నుంచుకొనిన నేనిట్టిదోషంబుల నైరింపకున్న వేరెవ్వరు సైరింతురనెను. అట్టుపై లక్ష్మీదేవి కేశవా! నేనెంతమాత్రమిక నీ చోటనుండను. నేవసియించెడిచోటఁదన్నిన మునిని మన్నించితివి వాఁడు నీశాంతమునుజూఁచి నీవు భయపడితివని చులుకఁదనంబుగఁబలుకఁడే! కావున చులుకదనంబుగఁజూచి * గొల్ల వాఁడెవఁడైనను నిన్నుగొట్టగలఁడు, ధరణివాసులు నవ్వుచు

* చోళరాజుయొక్క పసులకాపరి భగవంతుని గొడ్డలితోఁగొట్టెను.

నీపై * జాలు రువ్వఁగలరు, † మ్లేచ్ఛులు నిను సడ్డసేయక నీ గుణమాక్రమించఁగలరు. మఱియు నాకు నీవెడబాపుగల్పించిన బ్రాహ్మణ వంశజులు భిక్షుకులై తాము దారపుత్రాదులఁ బోషించుదురు, నిత్యకర్మలఁ గొన్నిటిని వదలి నీచుల నాశ్రయింపుదురు, పేదలై గ్రాసంబునకు విద్యలమ్ముచు జీవించుదురని శాపంబిచ్చి క్రమ్మఱవెడలి భూలోకమునందు శ్రీ వేంకటాచలమునకు పశ్చిమముగానున్న ‡ కొల్లాపురముచేరెను.

---

* ఆకాశరాజు సుతయైన పద్మావతి తన చెలికత్తెలచే హరిపై జాలు రువ్వించెను.

† తురుష్క ప్రభువులు ద్రవ్యాపేక్షచే శ్రీ వేంకటాచలము నాక్రమింప ప్రయత్నించిరి. మఱియు మతద్వేషముచేత క్షేత్రమును బాధసేయ నెత్నించిరి. ఢిల్లీ చక్రవర్తియైన జహాంగీరునకు భగవంతుఁడు ప్రసన్నుండైన చరిత్రము శ్రీ వేంకటేశ్వర భక్తవిజయములోని రెండవభాగమున గానవచ్చును.

‡ కొల్లయనగా విశేషము. నడుమ బయలును, నాల్గుప్రక్కలఁ గట్టడములునుగల యింటికి కొల్లారు లేక కొల్లారమని పేరు. సుమారు యిన్నూరు మైళ్లదూరములో కొల్లాపురియున్నది, నేటికిని యచ్చట శ్రీమహాలక్ష్మియాలయము ప్రశస్తముగానున్నది.

# మఱల భగవంతుఁడు వేంకటాద్రి జేరుట.

అట్టుపై భగవంతుఁడు లక్ష్మీదేవియొక్క యెడబాపున కోర్వక తానును భూలోకమునకు వచ్చి వేంకటాచలమున శ్రీ వరాహస్వామి సన్నిధికిని, శ్రీస్వామి పుష్కరిణికిని దక్షిణంబున బ్రహ్మచే నిర్మితంబైయున్న వల్మీకములోనికి ప్రవేశించెను.

శ్లో॥ ఆద్యాకృతయుగే జమ్బూద్వీపే భారతవర్షకే।
గంగాయాదక్షిణేభాగే యోజనానాంశతద్వయే ॥
పంచయోజనమాత్రేతు పూర్వాబ్ధేస్తుపశ్చిమే ।
మాసేభాద్రపదే విష్ణుతిథౌ విష్ణుసమన్వితే ॥
సిద్ధయోగే సోమవారే గిరౌనారాయణాహ్వయే !
స్వామీ పుష్కరిణీతీరే పశ్చిమేభూత్యపశ్చిమే ॥
బృందారకాణాంబృందైస్తు ప్రార్థితోలోకరక్షకః ।
ఆవిర్బభూవభగవాన్ శ్రీనివాసఃపరఃపుమాన్ ॥

అట్లు సర్వేశ్వరుఁడైన వేంకటేశ్వరుఁ డర్చావిర్భావముతో నవతరించి * పదివేల వర్షంబు లెవ్వరికినిఁ దెలియక

---

* పదివేల సంవత్సరము లెవ్వరికి తెలియకనుండెనన దేవతలకున్ను తెలియుపని యర్థము. తదనంతరము బ్రహ్మనిత్య సూరులతో వచ్చి యారాధించుచుండెను.

నిరతిశయానంద నిలయుండై పుట్టలోనుండగా * 28 ద్వాపర యుగములు జరిగి తదనంతరము కలియుగ ముదయించెను. ఆకాలములో భూమియందు చోళరాజు రాజ్యమేలుచుండెను.

## కరియావుభగవంతునికిక్షీరంబునొసఁగుట.

ఇట్లుండ కొల్లాపురియందుండిన శ్రీ మహాలక్ష్మీదేవి తన నిమిత్యమై భగవంతుఁ డేకాకిగా వల్మీకములోఁ బ్రవేశించియు న్నాఁడని చింతించుచు గొల్లచాన వేషమును ధరించుకొని చోళరాజు సతియొద్దకుఁబోగా బ్రహ్మ రుద్రులు గోవత్సరూపం

---

* 28 ద్వాపరంబులన 28 దేవయుగంబులు అనగా శ్రీ వేంకటేశ్వరుఁ డవతరించి యిప్పటికి 12,05,33018 పంద్రెండుకోట్ల యైదులక్షల ముప్పది మూడువేల పదునెనిమిది సంవత్సరములైనవి. బ్రహ్మకు పగలున్ను రాత్రిన్ని గడచిపోయినది. ఇప్పుడు జరిగేది బ్రహ్మయొక్క రెండవదినము. వేంకటాద్రిలో శ్రీ వరాహమూర్తి యవతరించి 196,08,53018 అనగా నూటతొంబై యారుకోట్ల యెనిమిదిలక్షల యేబదిమూడువేల పదునెనిమిది సంవత్సరములైనవి. కాఁబట్టి శ్రీవేంకటేశ్వర యవతారమునకు పూర్వము 1,840,320,000 అనగా నూటయెనుబది నాల్గుకోట్ల మూడులక్షల యిరువదివేల సంవత్సరములుఁ లేక 6 మన్వంతరములకు పూర్వమే శ్రీ వరాహమూర్తి వేంకటాచలమునందు వేంచేసియున్నారు. ఎన్ని పర్యాయములు సృష్టియైనదో యెవ్వరికి తెలియదు. సృష్టికి 2000 దేవయుగములైన తర్వాత శ్రీ వరాహమూర్తి యవతరించిరి. ఇప్పుడు జరిగే కల్పమునకు వరాహకల్పమని పేరు.

బులను ధాల్చి లక్ష్మికెదుట నిలువ నమ్మహాలక్ష్మి సంతసిల్లి గోవత్సంబుల నమ్మెదనని వచించ * చోళరాజు సతి తనబిడ్డకు పాలు ద్రాగించనెంచి గొల్లచానకు వలసిన విత్తంబిచ్చి యావుదూడనుగొనెను. తదనంతరము మహాలక్ష్మి కొల్లాపురముచేర చోళరాజునిసతి యావుదూడలను తనకున్న 2000 పశువులతోఁదోలి గోవకుని కొప్పగించెను. ఇట్లుండ బ్రహ్మస్వరూపంబైన ధేనువు గోవులతోఁగూడి మేయుచు వేంకటాచలము నెక్కి వల్మీకము లోనున్న శ్రీనివాసునికి క్షీరం బొసంగుచుండెను.

---

* చోళరాజులు రాజ్యంబునకువచ్చి 1600 సంవత్సరములైనదని నిర్ధారణముచేయ కారణములున్నను, చోళరాజ్యము కొద్దిపాటివిగా కలియుగ ప్రారంభమునందుండవలయును. భవిష్యోత్తరపురాణంబున కలియుగముదయమున చోళరాజ్య ముండినట్లు చెప్పఁబడియున్నది. కాఁబట్టి దాదాపుగా 4500 సంవత్సరములకు పూర్వమే చోళరాజ్యముండవలయును. శ్రీకృష్ణక్షేత్రంబున ధృతవర్మఁడను చోళరాజు రాజ్యంబు నేసినట్లు చెప్పంబడియున్నది. మఱియు ద్రావిడులైన చోళరాజుల కాలంబునందు శ్రీ వేంకటాచలమునకు తిరుపతియని పేరు కలిగినది. ద్రావిడదేశమునందున్న తరిమ క్షేత్రములకున్న తిరు అను ప్రథమశబ్దంబుతో పేర్లు కలిగినవి. తిరుతని, తిరువణ్ణామలై, తిరువడంచె, తిర్మవేళ్ళంకాడు, తిరువేలం, తిరుముల్లవాయల్, తిరువరంగం అని యనేక నామములుగలవు.

# శ్రీనివాసుని శీర్షంబున దెబ్బతగులుట.

చోళరాజు భార్య యావుకు పాలులేమిఁగని గోపకుని పిలిపించి విచారించగా వాఁడు తాను పాలుఁ ద్రావలేదన రాణి కినిసి వానిని దన్నించిపంపెను. అంత గోపకుండేడ్చుచు గోవునంటిపోగా నది తతిమ యావులతోఁజేరక వేంకటాద్రి నెక్కిపోయి వల్మీకమందు పొదుగు దిగజార విడిచి పాలును పుట్టయందు నిండింపఁజూచి కినిసి తన చేతనున్న గొడ్డలితో నావు నడినెత్తినఁ గొట్టఁబోయెను. అప్పుడు కారుణ్యసాగరుం డైన చక్రి తనకు తల్లివలె క్షీరంబు నిచ్చుచుండిన గోవును గొట్టఁబోకుమని తనశీర్షంబు నడ్డంబుగానిల్పెను. అంత గొల్ల వాని గొడ్డలిదెబ్బ శ్రీనివాసుని * మస్తకంబునఁబడి సప్తతాళ వృక్ష ప్రమాణము రక్తము నూర్ధ్వముగా వెడలెను. దానిఁ జూచి గోపకుఁ డదరుచు నేలంబడి మడిసెను. తర్వాత గోవు చోళరాజుని సభకుఁబోయి పొఱలుచుఁ గన్నీరునింప రాజది చూచి దిగులొంది దానివెంట కొందఱు భటులనంపెను. వారు

---

* భగవంతునికా గాయ మిప్పటికినిగలదు. శిరముపైఁబడిన గొడ్డలి జారుచువచ్చి గడ్డంబునఁబడెను. కాఁబట్టి గొడ్డలిదెబ్బచేఁ గలిగిన గురుతే నేటికిని గనఁబడుచున్నది.

గోపువెంటనంటివచ్చి పుట్టయందు రక్తంబు గురియుటయు, గోపకుఁడు మడిసియుండుటయు గని యా వృత్తాంతమును చోళరాజుతో విన్నవించిరి. అంతట చోళరాజు మంత్రులతోఁ గూడి వేగిర పుట్టవద్దకువచ్చి పుట్టనుండి రక్తంబు గురియుటకును, గోపకుఁడు మడిసియుండుటకును గారణంబేమని యాలోచించుచుండగా పుట్టలోనుండి నారాయణుఁడు శంఖచక్ర హస్తుండై చోళరాజును జూచి జరిగిన వృత్తాంతములం జెప్పి గోపకుఁడు రాజభటుఁడుగాన రాజున్ను పాపసంభూతుఁడై య్యెనని వానికి పిశాచమైపోవునట్లు శాపంబిచ్చెను. అందు మీఁదట చోళరాజు దిగులొంది యపరిమిత దుఃఖముచేఁ గ్రిందఁ బడి ముహూర్తకాలము మూర్ఛనొంది తర్వాత లేచి భగవంతునికి ప్రదక్షిణ దండంబు లాచరించి తన్ను క్షమింపవలయునని ప్రార్థించెను. అప్పుడు భగవంతుఁడు చోళరాజుకు శాపము కలియుగాంతమునఁ దీరుననియు, తాను ఆకాశరాజపుత్రియైన పద్మావతిని పరిణయంబు సేయునప్పుడు * రత్న కాంచన మయంబైన కిరీటమును జేసి తన శిరంబున నిల్పిన తాను శుక్రవారములందా కిరీటము నాలుగడియలు ధరియించుదుననియు, నాకా

* ఇప్పటికిన్ని శుక్రవారములందు శ్రీనివాసునికి చోళరాజుచే సమర్పింపఁబడిన కిరీటము ధరింపించఁబడుచున్నది.

లమందు మాత్రము చోళరాజు సుఖముగా నుండుననియుఁ జెప్పెను. తర్వాత చోళరాజు * శాపగ్రస్తుఁడైపోయెను

## శ్రీనివాసునికి బృహస్పతి మందుఁ జెప్పుట.

అంత భగవంతుఁడు గాయమున కోపఁజాలక బృహస్పతిని దలఁప సురగురుండు వల్మీకమువద్ద విచ్చేసి నిలువ వానిఁ జూచి గత వృత్తాంతంబంతయు నెఱిఁగించి గాయమునకు దగు యౌషధమును జెప్పుమనగా బృహస్పతి జిల్లేడిప్రత్తిని పాలులోఁ దడిపి గాయమునకుఁ గట్టిన నది మానిపోవునని జెప్పి హరివద్ద సెలవుపుచ్చుకొనిపోయెను.

## శ్రీనివాసుఁడు వరాహస్వామిని సంధించుట.

ఇట్లుండ నొక్కనాడు శ్రీనివాసమూర్తి గాయమునకు మందుఁదే నుద్దేశించి ప్రాతఃకాలమున లేచి పోవుచుండగా శ్రీవరాహస్వామి వృషభాసురుని సంహారించి భూదేవినిగూడి

---

* చోళరాజు పిశాచరూపముతో నిప్పటికిని సంచరించుచున్నాఁడు. పుట్టలోనున్న నారాయణుఁడు మొట్టమొదట గొల్లవానికి కనఁబడినందున యిప్పటికిని ప్రాతఃకాలమందు అర్చకులు మూలస్థానపు వాకిండ్ల దీయునపుడు గొల్లవాఁడే ముందు ప్రవేశించుచున్నాఁడు.

యఖిలపర్వతగుహాసాను శృంగంబులందు సంచరించుచు * ననేక సంవత్సరములు గడిపి తుద కొక్కనాడు శేషాద్రిని దలంచి మఱలివచ్చుచు నరునిచందంబున నిలచియున్న హరినిజూచి యతండు నొక్క రాక్షసుండేమోయని దలంచి ఘోరాకారుం డగుచు గోరలుగీటించి ఘర్జించగా భగవంతుండు క్రమ్మరఁబోయి తన పొదలో ప్రవేశించ వరాహదేవుండు చూచి యతఁడు శ్రీహరియని యెఱింగి నరునికైవడి పుట్టలోదాఁగి దీనత్వముతోనుండు కతంబేమని విచారించ హరి జరిగిన వృత్తాంతము లంజెప్పి కలియుగాంతమువఱకు తానచ్చట నివసించుటకుఁ గొంత చోటివ్వుమని యడిగెను. అదివిని శ్రీ వరాహస్వామి శంకించి

పేదల నాశపెట్టఁగారాదు.
భలవంతులకు చెంత నెడమియ్యరాదు.

అయినను నీవు ద్రవ్యమిచ్చితివేని నీకు నూఱడుగుల భూమిని గొలచి యిచ్చెదననెను. అందుకు హరి నావద్ద లక్ష్మి యున్నచో నట్లే యిచ్చుదును, లేనందువలన నేనెవరినిఁగొలచి తేఁగలను. కాఁబట్టి నిన్ను యాచించెదననెను. అని

* ఎన్ని సంవత్సరములు శ్రీ వరాహమూర్తి శేషాద్రియందు లేకయుండెనో చెప్పతరముకాదు.

చెప్పగా విని వరాహదేవుండు, ఇదియేమిమాట, ద్రవ్యమియ్య కనే భూమినియ్యఁజాలననెను.

## ముందు శ్రీవరాహదేవుని పూజించి పిమ్మట శ్రీ వేంకటేశ్వరుని నారాధించవలెను.

అటుపై శ్రీహరి నగుచు వరాహదేవునిఁజూచి ఓస్వామీ! ఈధరణియాద్యంతము మీదైయున్నది, అందులోఁ గొంచము నాకిమ్ము, నీవెంత యిచ్చిన నంతలో నేను వసియించుచు, నరునిచందంబున నటియించి, నరుల నిచ్చటికి రాఁజించి * ముందు నీకు పంచామృతస్నానము దిన దినము సేయింతును.

ముందు నీ † తీర్థమందు మునింగి, ముందు ‡ నీకు మ్రొక్కి కానుక లొసంగుఁడని నా భక్తులకు నియమింతును.

---

* ఇప్పటికిని ముందు పూజలు నైవేద్యములు శ్రీ వరాహమూర్తికి జరుగుచున్నది.

† ఇదియే శ్రీ వరాహతీర్థము. శ్రీ వరాహస్వామిగుడికి తూర్పుతటంబునందున్నది.

‡ ఇప్పటికిని తిరుపతికి యాత్రవచ్చెడి భక్తజనులు ముందు శ్రీ వరాహస్వామిని దర్శించి తర్వాత శ్రీ వేంకటేశ్వరుని సేవించుచున్నారు.

ప్రతిదినము నీకు ముందు యన్నంబిచ్చి తర్వాత నే భుజియించుదునని జెప్పెను.

అట్లుపై వరాహదేవుండు సంతసిల్లి నూఱడుగుల భూమిని గొలచి యిచ్చెను.



మాసోత్సవంబులు

రోహిణి=శ్రీరుక్మణి కృష్ణభగవానులకు.
ఆరుద్ర=శ్రీ వేంకటేశ్వర భాష్యకారులకు.
* పునర్వసు=శ్రీ సీతా రామలక్ష్మణ భరత శత్రుఘ్నులకు.
చిత్త=మైసూరు మహారాజులవారి పల్లకిసేవ.
శ్రవణం=లక్ష్మీ భూనీళాసమేత శ్రీ వేంకటేశ్వరులకు.
శుద్ధద్వాదశి=ద్వాదశిమంటపమున యాస్థానము.

తీర్థస్నాన పుణ్యకాలం.

చైత్రము=పౌర్ణమి - ఆకాశగంగతీర్థం.
వైశాఖము=బహుళద్వాదశి, పాండవతీర్థం.
ఆశ్వీజము=శుద్ధసప్తమి, పాపవినాశతీర్థం.

* శ్రీరామలక్ష్మనదాసుగారి దేవతోద్యానమున శ్రీరాములవారు వేంచే యుచున్నారు.

కార్తికము=పూర్వపక్షపంచమి, పద్మతీర్థము, పౌర్ణమి కపిల తీర్థము.

మార్గశీర్షము=శుద్ధద్వాదశియందు శ్రీస్వామిపుష్కరిణీతీర్థము, శుద్ధత్రయోదశి - సనకసనందనతీర్థము, పౌర్ణమి - చక్రతీర్థము.

పుష్యమి=పౌర్ణమి - రామకృష్ణతీర్థము.
మాఘము= పౌర్ణమి - కుమారధారతీర్థము.
ఫాల్గుణము=పౌర్ణమి - తుంబురుతీర్థము.

తతిమ యుత్సవములు.

శ్రీరామనవమి=శుక్లద్వాదశి మొదలు 3 రోజులు శ్రీరామలక్ష్మన దాసుగారి దేవతోద్యానంబున సీతారామలక్ష్మణ భరత శత్రుఘ్నులకు వసంతోత్సవము.

నృసింహజయంతి=శ్రీ తరిగొండవేంకమ్మ యింటిలో శ్రీవేంకటే శ్వరునికి ఆస్థానమహోత్సవము.

కౌశికద్వాదశి=ఉగ్ర శ్రీనివాసమూర్తికి సూర్యోదయమునకు ముందు తిరువీధులందు పేంచేపు.

ఆని ఆస్థానం=కుబేరు డప్పు నడుగుట. ఇదియే, ఆనివార యాస్థానము, ఆషాడమాస ప్రవేశము.

భాద్రపదము=బ్రహ్మోత్సవము-

ఆశ్వీజము=పౌర్ణమినాడు శ్రీమహంతు హాత్తిరాంజీబర్షీ.

పుష్యమి=పార్వేటుమంటపమున యాస్థానమహోత్సవము.

రథసప్తమికి=విశేషోత్సవము-

ఫాల్గుణము=చాంద్ర=సం=పండుగనాడు ఆస్థానం, నాటినుండి శ్రీస్వామివారికి 40 రోజులు నిత్యోత్సవము. దీనికే బకాళాబాతు వుత్సవములని పేరు-



## క్షేత్ర నిబంధనలు.

1 శిరస్సులో పుష్పములు ధరింపరాదు.

2 పుష్పముల నెవ్వరికి నియ్యరాదు.

3 మంచముపైఁ బరుండరాదు.

4 పాదరక్షల నుపయోగింపరాదు.

5 ఛత్రధరుండైపోరాదు.

6 మాంసమత్స్యాదుల భుజింపరాదు.

7 స్త్రీలు రజస్వలు కారాదు.

8 గర్భిణులు ప్రసవించరాదు.

9 దుర్భాషలాడరాదు.

10 త్రికరణశుద్ధిలేక దేవుని సన్నిధికిఁబోరాదు.

11 శ్రీ వరాహస్వామిని దర్శించక శ్రీనివాసమూర్తిని సేవించరాదు.

12 మెద్దలపై నివసింపరాదు.

13 మధుపానము చేయరాదు.

14 బియ్యము దంచరాదు.

15 కారముగల వస్తువుల వేఁచరాదు.

16 భూమి యదురునట్లుగా నడువరాదు.

17 భూమి యదురునట్టి కార్యములు చేయరాదు.

18 గొప్పశబ్దములు చేయరాదు.

19 అబద్ధము లాడరాదు.

20 జీవహింసలు చేయరాదు.

21 పగటిపూట నిద్రించరాదు.

22 స్త్రీభోగంబులు సలుపరాదు.

23 పచ్చిమ్రాకుల నఱకరాదు.

24 దేవునికి నైవేద్యము కాకమున్న భుజింపరాదు.

25 పుష్పముల నాఘ్రాణించరాదు.

26 దేవుని గుడిలో రాత్రి తీర్మానసేవ కాకమున్ను నిద్రించరాదు.

27 శ్రీనివాసునికి సమర్పించక నేవస్తువును భుజింపరాదు.

28 స్త్రీ పురుషు లేక శయ్యాపైఁ బరుండరాదు.

29 రథగజాశ్వంబుల నెక్కరాదు.

30 సింహాసనము మొదలగు యెత్తైన యాసనంబులపైఁ గూర్చుండరాదు.

31 శ్రీ కపిల తీర్థమున గ్రుంకి శ్రీ కపిలేశ్వరుని దర్శించి దండంబులిడక శైలారోహణము చేయరాదు.

హరిః ఓం.

శ్రీ వేంకటేశ్వర పరబ్రహ్మార్పణమస్తు.



# శ్రీ వేంకటేశ్వర భక్తవిజయము.



ప్రథమభాగము.—ఇందులో శ్రీ వేంకటేశ్వరుఁడవతరించినది మొదలు జరిగిన వృత్తాంతములు విశదంబుగానున్నవి. శ్రీ వేంకటాచల క్షేత్రవిషయంబులును, శ్రీ వేంకటేశ్వరుని విషయంబులును దెలియఁగోరినవారీ గ్రంథమును దప్పక చదివి చూడవలసినది. దీనిలోఁబది చక్కని ఆఫ్‌టోన్‌పటములున్నవి. 1 శ్రీ వేంకటేశ్వరునిపటము, 2 శ్రీ వేంకటేశ్వర దేవస్థానాధికారియైన శ్రీరామలక్ష్మనదాసుజీవారి పటము. 3 శ్రీ వేంకటేశ్వరుని చింతప్రూను వల్మీకనివాసము. 4 కుమ్మరభక్తుఁడు మట్టిపువ్వులతో శ్రీ వేంకటేశ్వరుని యారాధించుచుండఁగాఁ జూచి తొండమాన్ మహాచక్రవర్తి విభ్రమనొందుట. 5 దేవుఁడులేఁడని విసువుతోఁ బోవుచున్న శ్రీ హత్తిరాములను భగవంతుఁడు వృద్ధునివలెవచ్చి సంధించుట. 6 హఠయోగీశ్వరుఁడు రాయలువారికి యోగవిద్యా మహిమలఁజూపుట. 7 మాయయేనుఁగు చెఱకులు, టెంకాయమట్టలఁ దినుట.

8 శ్రీ వేంకటేశ్వరుఁడును, శ్రీ హత్తిరాంబావాజీయును పాచికలాడుట, 9 శ్రీమహంతు హత్తిరాంబావాజీ మఠము. 10 భగవంతుఁడును, మహంతును పాచికలాడుచు గిరిధరరాయలుకు శేవలొసంగుట. దీనివెల రూ. 2-8-0.

శ్రీ వేంకటేశ్వర భక్తవిజయము, రెండవభాగము వెల 1-8-0.

# శ్రీ ఏడుకొండల వేంకటాచలపతి కథలు.

ఇందులో 1 కడుపునొప్పి కోమటిసెట్టికథ. 2 కానుకల హుండి దొంగకథ. 3 ప్రసాదముల దొంగకథ. 4 హరివర పుత్రునికథ. 5 శ్రీ వేంకటేశ్వర బిక్షుపునికథ. 6 పుత్రసంతాన ప్రార్థనకథ. 7 శ్రీ వేంకటేశ్వరభక్తి కథ. 8 బ్రాహ్మణపోతర్చకునికథ. వెల రూ. 0 4 0.

# శ్రీ తిరుపతి రథోత్సవ మాహాత్మ్యము.

ఇందులో శ్రీ వేంకటేశ్వరుని రథముక్రిందుగ పంచవర్ష ప్రాయుం డైన యొక బాలుని సమర్పించిన చరిత్రమున్నది. తోహరాకావ్యము. వెల 0 1 6.

# శ్రీ వేంకటాచల ప్రదర్శిని.

ఇందులో శ్రీ వేంకటేశ్వరుని మాహాత్మ్యము, దర్శనములు, అర్చనలు, క్షేత్రనిబంధనములు, తీర్థములు, మంటపములు, మఠములు, దేవాలయంబులు, నింకయు ననేక ముఖ్య విషయంబులు విమర్శనము చేయంబడియున్నవి. 0 0.

# శ్రీ వేంకటేశ్వర ప్రార్థన.

ఇందులో నీలాలు ప్రార్థన, 2 వేయికాళ్ల మంటపము, 3 పాషాణ ప్రసాదము, 4 మన్రో ప్రభువు గంగాళము, 5 విల్లియందొర చలిపందిలి, 6 శ్రీ భాష్యకారుల ప్రార్థన, 7 గొల్లదాని మంటపము, ఈ చరిత్రములున్నవి. వెల 0 3 0,

# శ్రీ వేంకటేశ్వర లీల.

శ్రీ వేంకటేశ్వర భక్తి యుపన్యాసమును, అప్పలక్ష్మమ్మ చరిత్రమునున్నవి. వెల 0 1 6.

# శ్రీ తరిగొండ వేంకమ్మ చరిత్రము.

ఈ మహాభక్తురాలి చరిత్రము చాల యద్భుతమైనది. భగవంతుడామె చేత నన్నముభుజించుట, వేంకమ్మ వారి పీఠాం

బరమునుబట్టుకొనుట,రథము వేంకమ్మయింటివద్ద నిలచిపోవుట, వేంకమ్మ దిగుడుబావిని ద్రవ్వించుట మున్నగు యద్భుత విషయంబులున్నవి. వెల 0 4 6.

## శ్రీ వేంకటేశ్వర క్షేత్ర మాహాత్మ్యము.

ఇందులో శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము, మాహాత్మ్య విషయంబులున్నవి. వెల 0 1 0.

## శ్రీ వేంకటాచల తీర్థ వైభవమ్.

ఇందులో శ్రీ వేంకటాచలమునందలి 360 తీర్థముల మాహాత్మ్యమున్నది. వెల 0 3 0.

## శ్రీ మహంతు హత్తీరాంబావాజీ చరిత్రము.

శ్రీ వేంకటాచలమునందు ప్రభుత్వము వహించిన ప్రథమ మహంతు చరిత్రము. వెల 0 4 0.

## శ్రీ వేంకటేశ పరాక్రమము.

ఇందులో జహాంగీరను ఢిల్లీపాదుషా హిందూ దేవాలయంబుల పాడుసేసెదనని ద్వేషముతో శ్రీ వేంకటాచల పాద ప్రాంత్యముచేర్చ,భగవంతుఁడు ప్రసన్నుండై వానికి నిజతత్వంబు నిశదపఱచిన చరిత్రము. వెల 0 1 6.

# శ్రీ వేంకటేశ్వర భక్తి కీర్తనలు.

**ఇందులో** భజనకు, భక్తిమార్గమునకుఁదగిన కీర్తనములున్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| | వెల | 0 | 0 | 6 |
| శ్రీ వేంకటేశ్వర వింశతిక. | ,, | 0 | 0 | 6 |
| శ్రీ వేంకటేశ్వర దశకము. | ,, | 0 | 0 | 6 |
| శ్రీ తిరుపతి స్థలమాహాత్మ్యము. | ,, | 0 | 0 | [illegible] |
| శ్రీ వేంకటేశ సరసపాటలు. | ,, | 0 | 0 | 6 |
| శ్రీ అలమేల్మంగమ్మ శృంగార దరువులు | ,, | 0 | 0 | 6 |

---

## పటములు

| | | | |
|---|---|---|---|
| శ్రీ వేంకటేశ్వరుని పటము. | 0 | 2 | 0 |
| శ్రీ వేంకటేశ్వర పద్మావతీపటము. | 0 | 1 | 6 |
| శ్రీ పద్మావతీదేవి పటము. | 0 | 0 | 6 |
| శ్రీ వేంకటేశ్వర ఉత్సవమూర్తిపటము | 0 | 0 | 3 |
| శ్రీ వేంకటేశ్వరుని పటము, ఉభయనాంచారులతో | | | 6 |
| శ్రీ వేంకటాచల క్షేత్రపటము. | 0 | 2 | 0 |

---

# ముఖ్యగమనింపు.

శ్రీ వేంకటేశ్వరుని విషయములు, శ్రీ వేంకటాచల క్షేత్ర విషయములు, శ్రీవేంకటేశ్వరుని పరమభక్తుల విషయములున్ను తెలియఁగోరినవారు తప్పక శ్రీ వేంకటేశ్వర భక్తవిజయముఁ చదివిచూడవలసినది. అపూర్వ విషయములున్నవి, శ్రీ వేంకటాచల విషయమై యింతవఱకుఁ దెలియని యనేక రహస్యములు వెలుబడియున్నవి.

వెల రూ. 2 8 0


శ్రీ వేంకటేశ్వర బుక్ డిపో.

సి. ఆర్. నాయఁడు,

9 పరమానంద మొదలివీధి,

మదరాసు—౹.